

కీ|| శే|| తూపల్లి సుబ్బమ్మ, రామయ్య దంపతులు

## అంకితము

సుగుణ ఖనులు వారు సుబ్బమ, రామయ
జన్మనిచ్చినారు జగతి నాకు
పాద పద్మములను భక్తితో పూజించి
సాహితీ సుమాల సన్నుతింతు.

జన్మ నిచ్చినట్టి జననీ జనకులిప్డు
దివిని జేరి నారు భువిని వదలి
వారి కాత్మశాంతి వరుసతో కలిగింప
వేడుచున్నవాడ వేద వేద్య.

# భగవద్గీత

(పద్యకావ్యము)



ఈ పుస్తకము తిరుమల-తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయమున "ధార్మిక గ్రంథ ముద్రణ సహాయ పథకము"
క్రింద ముద్రింపబడినది.

రచయిత

తూపల్లి కృష్ణమూర్తి
రిటైర్డు తెలుగు పండిట్

1998

# ముందు మాట

నేడు ధర్మమనే మాట వినబడుచున్నదే గాని కనబడుట లేదు. సర్వే సర్వత్రా సమత, మమత, సఖ్యత, శాంతి కొరవడి. అశాంతి, అవినీతి, అశ్లీలత, అమానుష ప్రవర్తన కలిగి అత్యాచారాలు, అవినీతి, అస్తవ్యస్త పరిణామాలు, అలజడులు, అసంబద్ధ ప్రలాపాలు పెచ్చు పెరిగి పోయిన నేటి మానవాళి మనుగడలోని మాలిన్యాన్ని తొలగింపజేసి భక్తి ప్రపత్తులను కలిగించుటకై భగవద్గీతా సారాన్ని సులభశైలిలో, సుబోధక మగునట్లు తేట తెనుగు మాటలతో ఆటవెలది పద్యాలలో రచించడం జరిగింది.

భక్తాదులు యీ చిన్ని గీతా పద్య కావ్యాన్ని భక్తితో చదివి గీతాచార్యుడైన శ్రీ కృష్ణ భగవానుని కృపకు పాత్రులు కాగలరని విశ్వసించు చున్నాను.

ఇట్లు,<br>
భవదీయుడు,<br>
తూపల్లి కృష్ణమూర్తి.

# కృతజ్ఞత

నా యీ చిన్ని పొత్తము నందలి ప్రతి పద్యమును సావధానముగా పరిశీలించి పరిష్కరించిన సహృదయులు, నన్నొక పండితునిగా జేసి సకల విధముల నన్ను ప్రోత్సహించిన గురుతుల్యులు, పితృ సమానులునగు శ్రీ విద్వాన్ కోవూరు యతిరాజులు, బి.ఏ., బి.ఇ.డి. గారికి సర్వదా కృతజ్ఞుడను.

యతిరాజులు నా గురువులు
మతి మంతుని జేసి నన్ను మన్నన తోడన్
హిత మతితో మతి గరపిరి
సతతము నా హృదయమందు సన్నుతిజేతున్.

ఇందలి పద్యములను చదివి తమ అమూల్యమైన అభిప్రాయములను రచించి యిచ్చిన మహాకవులు, మాన్యులు; మహోదారులు నగు కవులందరికి వినయాంజలులు సమర్పించుకొను చున్నాను. గురు భావముతో నా యీ గీతా పద్యకావ్యమును సాంతము పరిశీలించి తన అమూల్యాభిప్రాయమును దెలిపిన నా ప్రియ శిష్యుడు, పలు ప్రాంతములలో కనకాభిషేకము లందుకొనుచున్న, కవితా గంగోత్రి, సరస్వతీ పుత్ర సహస్రావధాన చక్రవర్తి ఆచార్య డా|| మేడసాని మోహనావధానిని ప్రత్యేకముగా నభినందించు చున్నాను.

దయతో నా యీ పద్యకావ్యమునకు తుది మెరుగులు దిద్దిన శతక రామాయణ కర్త శ్రీ జి. కృష్ణ, ఎమ్.ఏ., గారికి నా వందనములు తెలుపుకొను చున్నాను.

ఈ భగవద్గీతా పద్యకావ్యము గ్రంథరూపము నొందుటకు ఆర్థిక సాహాయ్య మొనరించిన తిరుమల-తిరుపతి దేవస్థానం యాజమాన్యం వారికి హృదయ పూర్వక వందనములు తెలుపుకొను చున్నాను.

ఈ కావ్యమును సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చిన కీర్తి ఆఫ్‌సెట్ నేత పి. పురందర్ నాయుడు గారికి, వారి సహచర గణమునకును నమస్సుమాంజలులు సమర్పించుకొను చున్నాను.

ఇట్లు,
భవదీయుడు,
**తూపల్లి కృష్ణమూర్తి.**

# ఆముఖము

ఇది శ్రీ భగవద్గీతగాదు - శ్రీ భగవద్గీతాసారము మాత్రమే. ఎందరో మహానుభావులు ఎన్నో విధాలుగా శ్రీ భగవద్గీతను ఆంధ్రీకరించారు, వ్యాఖ్యానాలూ చేశారు. చేస్తూనే యున్నారు. ఆ ఆంధ్రీకరణలన్నీ కేవలం పండితులకు, జ్ఞానులకు మాత్రమే పరిమితమై పోయాయి. సాధారణ విద్యావంతులకే గాక పామరులకు సైతం శ్రీ భగవద్గీతా విషయాన్ని అందించాలనే మహదాశయంతో విద్వాన్ శ్రీ తూపల్లి కృష్ణమూర్తి శ్రీ భగవద్గీతా సారాన్ని రచించారు. మూలార్థానికి భంగం రాకుండా, ముఖ్యమైన శ్లోకాలనే గ్రహించి, సులభశైలిలో, సారళ్యంగా సాగిన వీరి అనువాద పద్ధతి బహుధా ప్రశంసనీయము. మహా మహా వేదాంతులనే తికమక పెట్టిన లోకోత్తర వేదాంత గ్రంథమైన శ్రీ భగవద్గీతా సారాన్ని ఇంత సులభశైలిలో ఉద్దిష్టార్థము చెడకుండ అనువదించడం సామాన్యం గాదు. అట్టి అనువాదాన్ని శ్రీ తూపల్లి కృష్ణమూర్తిగారు నిర్దుష్టంగా నిర్వహించారు.

మనకు తెలిసినంత వరకు శ్రీ భగవద్గీతను ప్రప్రథమంగా 16వ శతాబ్దిలో సరళ వ్యావహారిక శైలిలో వచనరూపంగా అనువదించినవారు కీ.శే. తాళ్ళపాక పెద తిరుమలయ్య - తిరుపతి వాసి. ఆనాటి నుండి నేటి వరకు ఎన్నో ఎన్నో ఎన్నెన్నో శ్రీ భగవద్గీతా ఆంధ్రీకరణలు వెలువడ్డాయి. ప్రస్తుతం విద్వాన్ తూపల్లి కృష్ణమూర్తి ఆటవెలదుల్లో అలవోకగా శ్రీ భగవద్గీతా సారాన్ని ఆంధ్రపాఠక లోకానికి అందించి, వారి జననాన్ని సఫలంబు జేసుకొన్నారు. పునర్జన్మంబు లేకుండగా శ్రీ కృష్ణమూర్తిగారు చేతులు తిరిగిన పండితులకు కూడా క్లిష్టమైన శ్రీ భగవద్గీతార్థాన్ని సుబోధకంగా అనువదించారనడానికి మచ్చునకు ఈ క్రింది శ్లోకాల అనువాదాన్ని చూడండి.

2-23. శ్లో|| నైనంఛిందంతి శస్త్రాణి నైనందహతి పావకః
న చైనంక్లేదయం త్యాపో నషోషయతి మారుతః

అనువాదం : ఆత్మనెట్టి శస్త్రమైన ఛేదింపదు,
ఆత్మ తగుల బడదు అగ్నిచేత,
తడుప బడదు నీట, తథ్యముగా నాత్మ
గాలి చేత నెండి గాసి బడదు.

18-61. శ్లో|| ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయన్సర్వ భూతాని, యంత్రారూఢాని మాయయా.

అనువాదం : ఈశ్వరుండు సకల విశ్వమునందలి
ప్రాణి కోటులందు పరగ వెలసి
తనదు మాయచేత తగ సర్వభూతాల
యంత్రమందు త్రిప్పు తంత్రముగను.

తెనుగులో చక్కని చిక్కని ఆటవెలదుల్లో శ్రీ భగవద్గీతా సారాన్ని అందించిన విద్వాన్ శ్రీ తూపల్లి కృష్ణమూర్తిగారు సర్వదా అభినందనీయులు. ఈ అనువాద శ్రీ భగవద్గీతా సారాన్ని ఆంధ్ర పాఠక లోకము ఆదరిస్తుందని ఆశిద్దాం. ఈ కవిగారి కలం నుండి మరిన్ని కృతులు రావాలని ఆంకాంక్ష.

ఇట్లు
బుధజన విధేయ
కోవూరు యతిరాజులు, B.A., B.Ed.,
రిటైర్డు హెడ్మాష్టరు, తిరుపతి.

తిరుపతి
తేది : 22-12-97

# ప్రశంస

ఆత్మీయులు శ్రీ తూపల్లి కృష్ణమూర్తిగారు నాకు బహుకాలం నుండి పరిచితులు. తెలుగు పండితులుగా వారు తెలుగు తల్లికి చేసిన సేవ మరువరానిది. భగవంతుడు వారికి శ్రవణ పేయమైన గాత్ర సౌభాగ్యమును ప్రసాదించినాడు. కమనీయమైన కంఠంతో వారు సంకీర్తనలు ఆలపిస్తుంటే 'శిశుర్వేత్తి పశుర్వేత్తి' అన్నమాట అక్షరాల సార్థక మౌతుంటుంది.

అలిపిరి దివ్యారామంలో ప్రతి సోమవారం నేను చేసే ఆధ్యాత్మిక ప్రసంగాలు వారి ప్రార్థనతోనే ప్రారంభ మౌతున్నాయి. వారిప్పుడు భగవద్గీతను పద్యకావ్యంగా రూపొందించి ప్రకటించడం ముదావహం. విశ్వమంతట వ్యాపించిన మహా గ్రంథాలలో గీత అగ్రశ్రేణికి చెందినది. ఇది సకల వేదసారము ఎందరో ఎన్నో విధాల దీనిని అనువదించి ప్రచురించి యున్నారు. శ్రీ తూపల్లి కృష్ణమూర్తిగారు గీతలో ముఖ్య భాగాలను మాత్రమే యెన్నుకొని, ఆటవెలది పద్యములుగ వాటిని సులభ సుందరమైన భాషలో వ్రాసినారు. గ్రంథ యోగ్యతను గుర్తించి T.T.D. వారు దీని ముద్రణకు ఆర్థిక సాయం అందించినారు. ఇది చాలా సంతోషింపదగిన విషయము.

ఇందలి రచన రామణీయకమునకు ఒకటి రెండు ఉదాహరణలు.

6-17 : "మితము, హితము గలిగి సతము శాకాహార
ములను గొనుచు నిద్ర, మెలకువయును
సకల కర్మములను సముచితముగ జేయ
కలుగు యోగ సిద్ధి సులువుగాను".

11-14 : "నీదు మహిమ దెలియ నేరక యాదవా!
సఖుడ! కృష్ణ! యనుచు సాహసమున
పిలిచి యుంటినయ్య, తెలియక జేసిన
నేరమించ వలదు! నీరజాక్ష!"

ఈ రమణీయమైన పద్యకావ్యం బహుళ ప్రచారం పొంది రచయితకు, పాఠకులకు అమందమైన ఆనందం కలిగించాలని మనసారా ఆశిస్తున్నాను.

శిరోమణి సముద్రాల లక్ష్మణయ్య, M.A.,
కార్యదర్శి, ధర్మప్రచార పరిషత్,
తి.తి. దేవస్థానములు, తిరుపతి

# అక్షరాంజలి

పూజ్య గురువర్యులు శ్రీ తూపల్లి కృష్ణమూర్తిగారు సహజ కవితా దురంధరులు. సంప్రదాయ దృక్పథము గలవారు సాహితీ సుమధురమైన, సరసమైన, సజ్జన కోటికానందదాయకమైన కళా సేవలో జీవనము గడుపుచున్న ధార్మిక నిష్ఠ కలిగినవారు. ఉపాధ్యాయ వృత్తిలో కీర్తి సంపదలు పండించుకొని మాదృశులెందరికో మార్గదర్శకులై నిలిచినారు.

ప్రస్తుతము వీరు సహృదయ భక్తలోకమున కందించుచున్న "భగవద్గీత" పద్యకావ్యము సరస్వతీ దేవికి ఒక దివ్య భవ్యాక్షరాలంకారము. భగవద్గీత సకల జగత్తునకు జ్ఞానమాత. సంఘర్షణాత్మకములైన ఎన్నియో లౌకిక, అలౌకిక సమస్యలకు పరిష్కారం సూచిస్తున్న వాఙ్మయ దేవత. ఆ దేవతా మూర్తిని ప్రసన్న మృదు మధుర శైలీ విన్యాసంతో ఆవిష్కరించిన గురువర్యులు కృష్ణమూర్తిగారు ధన్యులైనారు. రహస్యార్థ గర్భితములైన అధ్యాత్మ విషయములను ప్రసన్నముగా ప్రతిపాదించుటకు మిక్కిలి ఓర్పు, నేర్పు, మాటల కూర్పు, తలపుల తీర్పు అవసరం. ఇవన్నీ మా గురువు గారిలో పుష్కలంగా ఉన్నాయి.

"పుట్టినట్టి దెల్ల గిట్టియే తీరును  
గిట్టినదియు మరల పుట్టితీరు  
సహజ సిద్ధమైన చావు పుట్టుకలకు  
వగవనేల! మరణ భయము దేల?

ఇటువంటి పద్యాలు ఎంత సరళ సుందరంగా ఉన్నా యో రసజ్ఞులే గుర్తింపగలరు. కావ్యం పూర్తిగా ఇదే శైలిలో నడిచింది.

నేను చంద్రగిరి ఉన్నత పాఠశాలలో 6, 7 తరగతులు చదువుచున్న రోజుల్లో శ్రీ తూపల్లి కృష్ణమూర్తిగారు తెలుగు పాఠ్యాంశాల్ని బోధించేవారు. ఇప్పుడీ "భగవద్గీత" చదువుతూ ఉంటే ఇది కూడా ఒక పాఠ్యాంశంగా వారి దగ్గర చదువుకుంటూ ఉన్న అనుభూతి నాకు కలిగింది.

వీరి మాట ఎంత మధురంగా ఉంటుందో, పాట అంత కన్నా మధురంగా ఉంటుంది. కారణం సరస్వతీ దేవి స్తనద్వయం నుండి కూడ స్తన్యాన్ని ఆస్వాదించినవారు. వీరి లేఖిని నుండి మరిన్ని మధుర కావ్యాలు అవతరింపగలవని ఆకాంక్షిస్తున్నాను. గురువు గారైన శ్రీ తూపల్లి కృష్ణమూర్తి గారికి సవినయంగా ఈ "అక్షరాంజలి" సమర్పిస్తున్నాను.

డా॥ మేడసాని మోహన్  
కవితా గంగోత్రి, సరస్వతీపుత్ర,  
సహస్రావధాన చక్రవర్తి.

తిరుపతి  
తేది : 27-1-98

శ్రీ

# భగవద్గీత - (పద్యకావ్యము)

శ్రీ గణేశ! వరద, శ్రీకర, శుభకర
నిన్ను గొలుతు నయ్య నిక్కువముగ
విఘ్నములను బాపి, విజయంబు జేకూర్చి
నన్ను బ్రోవ వయ్య సన్నుతాంగ!

శారదాంబ! నన్ను సరగున బ్రోవుము
మదిని దలతు నమ్మ మధుర వాణి!
మంచి పలుకు నిచ్చి అంచితముగ బ్రోవు
నతు లొనర్తునమ్మ నలువ రాణి.

అంజనీ తనూజ! అఖిల విద్యాధిప!
సకల భువన వినుత! సౌమ్యరూప
రామపాద పూజ రంజిల్ల జేసిన
పవన తనయ నిన్ను ప్రస్తుతింతు.

గురువు లందరకును గురుతర మతితోడ
వందనంబులిడుదు డెంద మలర.
గురు కటాక్షమున్న తరుగక పెరుగును
సకలమైన శాస్త్ర సముదయంబు.

ఆట వెలదు లందు తేట తెల్లముగను
సంగ్రహముగ గీత సారమెల్ల
చేతనైన పగిది చెప్ప బూనిన వాడ
ఆలకించరయ్య! ఆర్యులార!

# భగవద్గీత - (పద్యకావ్యము)

## 1. అర్జున విషాదయోగము

యుద్ధ భూమిని జేరి బంధుజనుల జూచి విషాదము నొందిన అర్జునునకు విషాదమును దొలగించి విజ్ఞానమును కలిగించు యోగమిది.

**ధృతరాష్ట్రుడు :**

ధర్మ భూమియైన దగు కురుక్షేత్రాన
నాదు సుతులు పాండు నందనులును
రణము జేయ బూని రాజన మొప్పగ
ఏమి జేసి నారో యెరుగ దలతు
సవివరముగ నాకు సంజయా! దెలుపుము
సంతసింతు నేను చింత దొలగి.

**సంజయుడు :**

అర్జునుండు, కృష్ణు, డభిమన్యుడాదిగ
శంఖ నాదములను సలిపి రయ్యా
దిక్కు లెల్ల నిండి దిశలు మార్మ్రోగెను
నీ దుసుతుల గుండె నీరు గారె.

**అర్జునుడు :**

వానర ధ్వజుండునైన యర్జునుడంత
ధనువు చేత బూని వినుతి జేసి
రథము నిలుప వయ్య రణభూమి నోకృష్ణ!
శత్రు సైన్యములను చక్క జూతు.

హరియు రథము నిలువ పరికించె పార్థుడు
తాత, తండ్రి, బంధు తతుల తోడ
భ్రాతృ, మిత్ర, పౌత్ర బహువిధ గురుజనుల్
శత్రు సైన్యమందు నరిగ నుండ

కుంతి పుత్రుడపుడు కురు సైన్య మందున్న
సకల బంధువులను వికల మతిని
కలయ జూచి మిగుల కరుణాళు వగుచును
బావ జూచి యనియె బాధ తోడ.

తల్లడిల్లు చుండె నుల్లము పెల్లుగ
సన్నగిల్లు చుండె సత్త్వ మదియు
జారి పోవు చుండె భూరి గాండీవము
చిత్త విభ్రమంబు చెందె నాకు.

బంధువులను జంపి పొందు సుఖమదేమి?
అందు వలన మేము బంధువు లగు
కౌరవులను నెల్ల కరుణ లేకుండగ
చంప బూన దగదు చక్రధారి!

కులము చెడిన యెడల కుల ధర్మములు చెడు
ధర్మ మదియు చెడియ ధర్మ మెనగు
వర్ణ సంకరమున వసుధ నరకము గల్గు
హితము గలుగ బోదు పితరులకును.

**సంజయుడు :**

**పార్థుడట్లు బలికి బహు దుఃఖ వశమున**
**కలవరంబు మదిని గలుగు చుండ**
**ధనువు, బాణములను తగవీడి రథ మందు**
**గూరు చుండెనట్లు నూరు మనుచు.**

## 2. సాంఖ్య యోగము

సంఖ్యలతో గూడిన యోగమే సాంఖ్య యోగము. అనగా శరీర మందలి పంచ భూతములు, బాహ్యేంద్రియ అంతరింద్రియములను వానిని ఒకటి, రెండు, మూడు అని సంఖ్యలుగా నొకటొకటిని తొలగించి అనగా ఇంద్రియములనే సంఖ్యలను తొలగించి జ్ఞానమును కలిగించు యోగమే సాంఖ్య యోగము.

సాంఖ్య యోగము నందలి 2, 3 శ్లోకములు మానవుని మేల్కొలుప గల ముఖ్య శ్లోకములని వివేకానందుని ప్రబోధము.

**భగవానుడు :**

ఇహ పరముల జెరచు నిట్టి పిరికి బుద్ధి
కలిగె నేల యుద్ధ కాల మందు
శత్రు మర్ద నుడవు సరగున లెమ్ము, యు
ద్ధమ్ము జేయ బూను కొమ్ము పార్థ!

**అర్జునుడు :**

గురుతుగా గణించు గురువుల, తాతల
తగదు సంహరింప ధర్మ చరిత
రక్త సిక్తమైన రాజ్య భోగము కంటె
మేలుగాదె బిచ్చ మెత్తు కొనుట.

## ధర్మోపదేశమిచటి నుండి ప్రారంభము

ఏడ్వరాని వారి కేడ్చు చుంటివి నీవు
పండితుండ ననుచు పలుకు దీవు
బ్రతికి యున్న మరియు మరణించి యున్నట్టి
వారి కొరకు బుధులు వగవ రెపుడు.

పై పద్యము గీతా రత్న హారమునకు మొదటి మణి వంటిది, గీతా వృక్షమునకు బీజము వంటిది.

భూత కాలమందు భువి వర్తమానాన
మరణమైన వెనుక మనము గలము
ఆత్మ శాశ్వతంబు అది చావు లేనిధి.
దీని దెలియ దగును దేహి నతము.

ఆత్మ పుట్టదయ్య అది చావ దెప్పుడొ
కప్పుడుండి మరి యొకపుడు లేక
పోదు. కాన నిత్యమది శాశ్వతంబగు
ఆత్మ నాశనంబు నంద బోదు.

చిరిగి పోయినట్టి జీర్ణ వస్త్రములను
వదలి జీవి క్రొత్త వలువ లగొను
నట్లు, యాత్మ శిథిలమైన దేహము వీడి
క్రొత్త దేహమందు కోరి చేరు.

ఆత్మ నెట్టి శస్త్రమైన ఛేదింపదు,
ఆత్మ తగుల బడదు అగ్ని చేత,
తడువ బడదు నీట, తథ్యముగా నాత్మ
గాలి చేత నెండి గాసి బడదు.

నరుక, తడువ, కాల్చ మరియు నెండింపగ
వలను పడని దాత్మ వసుధ లోన
ఆత్మ సర్వ గతము, అచలంబు, సుస్థిర
మై, సనాతనంబునై వెలుంగు.

పుట్టినట్టి దెల్ల గిట్టియే తీరును
గిట్టి నదియు మరల పుట్టి తీరు
సహజ సిద్ధమైన చావు పుట్టుకలకు
వగవ నేల? మరణ భయ మదేల?

ధర్మ యుక్తమైన దగు యుద్ధమును నీవు
చేయకున్న యెడల చెడును కీర్తి
ధర్మ హాని గలుగు ధరలోన దెలియుము
ప్రాప్త మగును నీకు పావ ఫలము.

ఎదుటి వారు మిగుల నెగతాళి చేయుచు
నింద జేతురయ్య నిన్ను జూచి
చేత గాని వాడు, చేవ జచ్చిన వాడు,
పోరు సలుప లేని భీరు వంద్రు.

చంప బడితివేని ఇంపగు స్వర్గంబు
రణవి జయము గొనగ రాజ్య మబ్బు
కాన రణము సేయ కార్య మిత్తరి నీకు
లెమ్ము సవ్య సాచి! తెమ్ము జయము.

జయము, అపజయంబు, సౌఖ్య దుఃఖములును
సమము లంచు దలచి సమరమునకు
గడగి పూను కొనుము కర్తవ్యమును జేయ
పాప ఫలము నీవు పడవు పార్థ!

కర్మములను జేయ గల యధికారమే
నీకు గలుగు గాక! నియతి గాను
కర్మ ఫలము నందొ కప్పుడైనను గాని
కోర్కె నీకు కలుగ కుండు గాక!
కర్మ ఫలములకును కారణమైన వా
డవును గాకు మయ్య నీవు నెపుడు
కర్మ జేయకుండ, కర్మమా నుట యందు
కోర్కె నీకు కలుగ కుండు గాక!

కోరికలను విడిచి, కోప తాపము లేక
అహము, మమత లుడిగి అణగి మణగి
సంచరించు వాడు సకల దుఃఖములను
వదలి మోక్ష మొందు ముదము గాను.

## 3. కర్మ యోగము

ఏ కర్మ నెట్లు చేయవలెనో, ఏ విధముగ జేసిన జీవుడు ఇహ పర లోకములందు సుఖము నొందునో మొదలైన విషయములు సూక్ష్మముగ ఈ అధ్యాయమున వివరింపబడినవి.

అర్జునుడు :

జ్ఞాన యోగ మదియె యౌను కర్మము కంటె
మేటి యనుచు నీవు మేలు గాగ
దలతు వేని కృష్ణ! దారుణముగ నన్ను
సిద్ధ పరచ నేల? యుద్ధమునకు
కలత జెందె మనసు కడగి మేలో! కీడో
వివరముగను దెలుపు విశ్వ వినుత!

భగవానుడు :

చేయదగిన పనులు చేయుము నియతిగ
కర్మ మదియె ముక్తి కారణమగు
కర్మ లేక బ్రతుకు కడు దుర్లభంబగు
నియత కర్మ మెపుడు నిలుప రాదు.
ప్రతిఫలంబు వదలి పరమాత్మ ప్రీతికై
కర్మ లాచరింప గడగు పార్థ!

సృష్టి కర్త, ప్రజల సృష్టించు నప్పుడు
"యజ్ఞ కర్మ జేసి యశము గొనుడు
ఇష్ట ఫలము నిచ్చు నీ యజ్ఞ కర్మలు"
అనుచు బలికె నతడు అనువు గాను.

యజ్ఞ కర్మములకు నా దేవతలు మెచ్చి
ఇష్ట భోగములను నివ్వగలరు
అందు కొంత వారి కర్పింప కుండెడు
వాడు చోరుడగును వసుధ లోన.

ప్రాణు లన్నము ననె పరగ బుట్టుచు నుండు
వర్ష మన్న మిచ్చు వసుధ లోన
వాన గురియు చుండు వర యజ్ఞముల చేత
కర్మ కాండ యజ్ఞ కారణమగు
కర్మ బ్రహ్మ వలన కలుగును, బ్రహ్మయు
పరమ పురుష వలన పరగ బుట్టు
యజ్ఞములను నెపుడు హరి వశి యించును
గాన యజ్ఞ కర్మ మాన వలదు.

ఫలము నందు కోర్కె విలసితముగ వీడి
విధితమైన కర్మ విడువ కుండ
చేయునట్టి వాడు ఖాయముగా మోక్ష
మొంద గలుగు నయ్య అందు వలన
ఫలితములను నీవు పటుతరంబుగ వదలి
చేయ దగిన కర్మ జేయవయ్య.

శ్రేష్ఠులైన వారు చేసిన పనులెల్ల
అనుసరించు చుందు రఖిల జనులు
వారు చూపినట్టి బాటను నడచును
జన సమూహ మెల్ల జగతి లోన.

సర్వ కర్మములను సరిగ నా యందుంచి
ఆశ పాశములను నణగ ద్రొక్కి
చింత లెల్ల మాని చీకాకులను వీడి
యుద్ధమునకు నీవు సిద్ధ పడుము.

బాగు గాను చేయబడు పర ధర్మము
కంటె, గుణము లేని కర్మ యైన
తనదు ధర్మ మెంతొ తగ మేలు గలదగు
అందు మరణమైన నదియె మేలు.

అర్జునుడు :

ధరణి యందు నరుడు తనకసమ్మత మయ్యు
పాప కార్యములను పరగ జేయు
కారణంబ దేమి? వారణ రక్షక!
నంది యంబు దీర్పు సర్వ వినుత!

భగవానుడు :

క్రోధ మదియు, కామ గుణములు రెండును
రజను వలన గలుగు రాజపుత్ర!
తనివి దీర నట్టిదగు కామ మదియును,
పాప హేతువైన కోప గుణము,
పరగ మానవులకు పరమ శత్రువు లివె
తెలిసి కొనుము పార్థ! తెలివి గలిగి.

అందు వలన మొదట నా యింద్రియములను
అదుపు నందు నుంచి యనువు గాను
జ్ఞాన నాశనమును మానక నొనరించు
కామ పాపి. దాని కడకు విడుము.

ఇంద్రియములు మిన్న యీ దేహమున కంటె
మిన్న యింద్రియముల కన్న మనను
మనను కన్న బుద్ధి మరి గొప్ప దైనది
ఆత్మ బుద్ధి కంటె యధిక మగును.

ఆత్మ బుద్ధి కంటె నధికముగా నెంచి
తన్ను తాను దెలిసి ధరణిలోన
కామ రూపమైన కఠిన దేహంబును
రూపు మావ వలయు నేవు మీర.

## 4. జ్ఞాన యోగము

జ్ఞానము వలనను పరమాత్మ యందైక్యము గలుగునని తెలుపుటచే దీనిని జ్ఞాన యోగ మందురు.

**భగవానుడు :**

**దుష్ట శిక్షణంబు, శిష్ట రక్షణమును**
**ధర్మ సుస్థిరతకు తగిన రీతి**
**సంభవించు చుందు నవ్యసాచీ నేను**
**యుగ యుగంబు నందు జగతి లోన.**

భయము, కోపములను నియతిగ యనురాగ
ములను విడిచి పెట్టి విలసితముగ
నన్ను నాశ్రయించి నా మీద మనసుంచి
తత్త్వ మెరిగి చేయు తపసు వలన
నా స్వరూపు లగుచు నా యందు చేరిరి
పరమ పురుషులైన పలువు రిట్లు.

ఏ విధముగ నన్ను సేవింతురో వారి
నా విధమున నేను ఆదరింతు
మనుజులెల్ల నాదు మార్గమునేయెల్ల
ఎడల ననుసరింతు రిందువలన.

గుణము, కర్మములను, గుణి యించి నరులను
నాల్గు వర్ణములుగ నయము గాను
నేనె సృష్టి జేసి నానయ్య దెలియుము.
నేనె వాని కర్త యైన గాని,
నేను కర్త గాను, నే శాశ్వతుడనని
తెలిసి కొనుము పార్థ! తెలివి గలిగి.

కర్మ లంట బడవు కర్మ ఫలము నందు
ఆశలేదు నాకు అందు వలన
ఈ విధమున నన్ను యేనరు డెరుగునో
కర్మ చేత వాడు కట్టు బడడు.

మోక్ష కాములైన మునుపటి వారలు
కర్మ తత్త్వ మెరిగి కర్మములను
ఆచరించి రయ్య ఆ కారణంబున
నీవు జేయ వలయు నియత కర్మ.

జ్ఞాన వంతుడగుచు సంశయ రహితుడై
కామ రహితమైన కర్మ జేసి
ఆత్మ నిష్ఠుడగుచు నాత్మ సాక్షాత్కార
మంద, కర్మ బంధ మొందడతడు.

జ్ఞాన ఖడ్గమునను సకల సంశయముల
ఛేద నంబు జేసి మోదమునను
యోగ నిష్ఠుడగుము వేగ కర్తవ్యంబు
జేయ లెమ్ము పార్థ! మాయ వీడి.

# 5. కర్మ సన్న్యాసయోగము

గృహస్థాశ్రమము మంచిదా? కర్మ సంగమును వదలిన సన్న్యాసాశ్రమము మంచిదా? అను ప్రశ్నలకు ఇందు సమాధానము లివ్వబడినవి.

**అర్జునుడు :**

కర్మ సన్న్యాసంబు కడుమే లటంచును
కర్మ యోగ మదియె కార్యమయ్య
అనుచు జెప్ప నేల? అరమర లేకను
ఏది మంచి దగునొ యెరుగ జెపుము.

**భగవానుడు :**

కర్మ సన్న్యాసంబు, కర్మ యోగంబును
ముక్తి మార్గములగు ముదము గాను
కర్మ సన్న్యాసంబు కంటెను నిష్కామ
కర్మ మెంతొ మేలు మర్మమిదియ.

ద్వేష మనున దెట్టి విషయములో లేక,
దేని యందు కోర్కె లేని యట్టి
మనుజు డెల్ల వేళలను నిత్య సన్న్యాసి
బంధముల విడువ బడును వాడు.

దేహి దేహాభి మానమును పూర్తిగ వదల వలెను. జాతి, కుల, మత సంబంధమైన అభిమానముల నన్నింటిని పూర్తిగ వదల వలెను. చివరకు ఆడ, మగ అనే విషయాన్ని కూడ విసర్జింప వలెను. అందుకే శ్రీ కృష్ణ పరమాత్మ గోపికల వస్త్రముల నపహరించెను. ఆయన తీసికొన్నది వారి చీరలను గాదు, వారి దేహాభిమానాన్ని అనే విషయాన్ని మనం గమనించ వలెను.

**ఆత్మ నెరిగి నట్టి యా యోగి తాజూచి,**
**వినుచు, తినుచు, తాకి, కనులు దెరచి**
**మూసి, కనుల జూచి, ముక్కుతో శ్వాసించి,**
**నిద్ర గొనుట, నడక, నియమములని**
**మాటలాడుటయును, మరి విసర్జించుట**
మొదలు గాగ సకల విధములైన
వాని వాని పనులు వరుస నింద్రియములు
జేయు చుండు. నేను జేయనేర,
నేను కర్తగాను, నే సాక్షి మాత్రుడ
ననుచు దలచి యుండు నయ్య పార్థ!

సర్వ కర్మములను సర్వేశు నందుంచి
ఫలము నందు కోర్కె వరగ విడిచి
యుండు నట్టి యోగి యుదకంబుచే తామ
రాకు తడవ నటుల నమరి యుండు.

గోవు, కుక్క, యేనుగుల యందు, విప్రుల
లోను, కుక్క దినెడు హీను లందు
వెలుగు చుండు వేద వేద్యు డొక్కండని
సమత గలిగి యుంద్రు జ్ఞాను లెపుడు.

సమ మనగా పరబ్రహ్మమే. అనగా ఆత్మయే. జ్ఞానులు సర్వ ప్రాణుల లోను పరమాత్మను దర్శింతురు.

మనన శీలుడైన మానవ మాత్రుడు
సర్వభోక్త గాను, సర్వలోక
హితుని గాను నన్ను సతము నెరింగియు
మోక్ష పదము నొందు మోదముననను.

# 6. ఆత్మ సంయమ యోగము

మనసును నిగ్రహించి దానిని పరమాత్మ యందు లయ మొనర్చుటకై చెప్పబడినదే ఈ యోగము.

**భగవంతుడు :**

అర్జునా! తెలియుము అందరు దేనిని
సన్న్యసం బటంచు జగతిలోన
చెప్పు చుందు రదియె చెలగి యోగంబని
ఎరుగ వలయు సుమ్ము. ఏల ననగ
కోరికలను వదల కుండెడి యెవడును
జగతి యోగి యగుట జరుగ దెపుడు.

విషయ వాస నలవి విరివిగ గలిగిన
మనసు శత్రు వగును మనకు నెపుడు
విషయ వాసనలను విడిచిన మనసది
తనకు బంధువగును తథ్యము గను
సంగమముల వదలి సంసార జలధిని
మునిగి యున్న తనను సునిసితముగ
ఉద్ధరించు కొనుచు శుద్ధాత్మ నెప్పుడు
ముంచ వలదు విషయ సంచయముల.

ఆత్మ దృష్టి గలిగి అందరి యెడలను
సమత, మమత జూపి సర్వులందు
మట్టి పెళ్ళ, రాయి, మరియు బంగారంబు
సమము గాను జూచు సద్గుణుండు,
శత్రు, మిత్రు లందు సమ బుద్ధి గలవాడు,
యోగు లందు గొప్ప యోగి యగును.

మితము, హితము గలిగి సతము శాకాహార
ములను గొనుచు నిద్ర, మెలకువయును
సకల కర్మములను సముచితముగ జేయ
కలుగు యోగ సిద్ధి సులువు గాను.

గాలి లేని చోట నోలి చలింపక
వెలుగు దీప మటుల చెలువు మీర
సాధనమున యోగి సాధింప మనసును
స్థిరత గలిగి యుండు చిత్తమెపుడు.

అర్జునుడు :
మనసు చంచలంబు మరి నిరోధింపంగ
వశము గాని దయ్య వాయు వట్లు
ఇట్టి మనసు నిల్ప నెట్లు సాధ్యంబగు
కష్టతరము గాదె కమల నయన.

భగవంతుడు :
మనసు చంచలంబు, మనసును నిల్పగ
కష్ట సాధ్యమనుట కడు నిజంబు
సాధనమున మనసు సర్వము వశమగు
అభ్యసింప వలయు ననవరతము.

అర్జునుడు :
శ్రద్ధ గలిగి గూడ శమ దమాదుల నెల్ల
నిగ్రహించు కొనెడు నేర్పు లేక
యోగ సిద్ధి బొంద యోగ్యుడు గాకున్న
నెట్టి గతిని బొందు నెరుగ జెపుమ.

భగవంతుడు :
యోగ భ్రష్టుడైన యోగికి చ్యుతి లేదు
పుణ్యలోక మేగి పూజ్యుడగుచు
సిరిని గలిగి నట్టి శ్రీమంతు లింటను
జనన మొందు నయ్య జగతి లోన.

యోగి సాధనమున యోగ సిద్ధిని బొంది
మోక్ష పదము నొందు మోదమునను
వేద విహిత కర్మ వేత్తల కన్నను
ధ్యాన యోగి యెపుడు మిన్న యగును
గాన పార్థ! నీవు కడు ప్రయత్న మొనర్చి
ధ్యాన యోగి వగుము ధన్య చరిత!

# 7. విజ్ఞాన యోగము

ఈ అధ్యాయమున భగవంతుని మహిమలు, భక్తులలోని భేదములు, భక్తి విధానములు తెలుపబడినవి.

**భగవానుడు :**

నన్ను నమ్మి మనసు నా యందు నిలిపియు
నన్ను నాశ్రయించి సన్నుతముగ
యోగ మభ్యసించి యోగ్యముగా గను
సంశయంబు వీడి సముచితముగ
నన్ను నెట్లు దెలియనగు దాని దెలిపెద
వినుము పార్థ! నీవు విహితముగను.
తనదు పూర్వ పుణ్యమున కోటి కొక్కడు
ఆత్మ సిద్ధి కొరకు నలమటించు
అట్టి వారి లోన నతిశయంబుగ నన్ను
దెలియ గల డొకండు తెలియు మోయి!

భూమి, నీరు, నిప్పు, బుద్ధి, యహంకార
మాకసంబు, గాలి, అరయ మనసు
అనుచు నాదు ప్రకృతి అష్ట విధము లుండు
తెలియ దగును దీని తెలివి గలిగి.

జలము నందు రుచియు, శశి సూర్యులందున
వెలుగు, వేదములలొ వెలసి నట్టి
ప్రణవ మేది గలదొ వరికించి చూడగ
అదియు నేనె యనుచు నరయ దగును.

అగ్ని యందు తేజ మఖిల భూతము లందు
ఆయు వదియు, భూమి యందు గలుగు
వాస నయును, తపసు చేసెడి వారిలో
తపను నేనె యగుదు తలచి చూడ.

త్రిగుణ రూపమైన దివ్యము నైననా
మాయ దాట లేరు మనుజు లెవరు
నన్ను శరణు జొచ్చి నన్నాశ్రయించిన
నరులు దాట గలరు నాదు మాయ.

సకల జీవరాశి సుఖ దుఃఖ రూపమౌ
మాయ చేత మిగుల మంద బుద్ధి
కలిగి, జనన మొందు కలియుగ మందున
ననుచు దెలియ వయ్య అమర వినుత!

పాప రహితులైన పావన చరితులు
ముక్తి బొంది మోహములను విడిచి
నియమ నిష్ఠ గలిగి నిశ్చల చిత్తులై
నన్ను జెంద గలరు నయముగాను.

భూత జాల మెల్ల పుట్టుకతో రాగ
ద్వేషములచె గలుగు దోషములచె
మోహమునను కడకు మునిగియ జ్ఞానము
లోన బడును పార్థ! లోకమునను.

## 8. అక్షర పరబ్రహ్మ యోగము

**అర్జునుడు :**

నాశము లేని, నిత్యమైన ఆత్మలో జీవుని ఐక్య పరచు యోగమే అక్షర పరబ్రహ్మ యోగము. ఇందు అర్జునుడడిగిన ఎనిమిది ప్రశ్నలకు భగవానుడు సమాధానము లిచ్చియున్నాడు.

ఆది బ్రహ్మమేది? అధ్యాత్మ, మధిభూత
మాది దైవ మేది? యేది కర్మ?
దేహ మందు నెట్లు తేజ రిల్లుచు నుండు
ఆయధిజ్ఞుడనఘ! నరయ జెపుమ.

భగవానుడు :

బ్రహ్మ మనగ నాశరహిత మైనట్టిది
బ్రహ్మ భావమైన ప్రత్యగాత్మ
అదియె చెప్పబడును యధ్యాత్మ మనుచును.
భూత కోటి సృష్టి, భువిని మరియు
మంత్ర పూర్వకముగ మరి మరి చేసెడి
యజ్ఞమేది కలదొ యదియె కర్మ.

మరణ కాల మందు మదిలోన ననునెంచి
తనువు విడిచి చనిన తాను, పిదప
మోక్ష మంద గలడు మోదము మీరగ
సంశయంబు వలదు సత్యమిదియు.

ఎవడు మరణ మందు నెట్టి భావములతో
తనువు వదలి చనునొ నరువు గాను
అట్టి భావ రూప మతడు పొందును గాన
సతము నన్నె దలచి చక్క గాను
రణము జేయవయ్య రాజ కుమారక
నన్ను జెంద గలవు నయము గాను.

మరణ కాలమందు మనసు నిశ్చలతతో
భక్తి తోను, యోగ బలము తోను
కన్ను బొమల మధ్య కడు మిన్నగా ప్రాణ
శక్తి నిలిపి మిగుల చక్కగాను
పరమ పురుషుడైన పరమాత్మ దలచిన
అతడు దివ్య పురుషు నంద గలడు.

'ఓం, అనియెడు ప్రణవ ముచ్చరించెడు వాడు,
నన్ను చింత జేయు న[illegible]రుడును,
తనువు విడిచి యె[illegible]డు తరలిపోవునొ వాడు,
శ్రేష్ఠమైన యట్టి స్థితిని బొందు.

బ్రహ్మలోక పరిధి బహు లోకములలోను
జనన మరణములవి సహజమయ్యె
నన్ను బొందినట్టి నరులకు మాత్రము
జన్మ గలుగ బోదు జగతి లోన.

## 9. రాజ విద్యారాజ గుహ్యయోగము

విద్య లన్నిటిలోను బ్రహ్మ విద్య రాజు వంటిదని, పూర్వపు రాజులు గీత ననుసరించి ముక్తి బొందిరనియు, ఇది అందరికి అన్ని కాలములలోను, స్త్రీ, పురుష భేదము లేక ఆచరించుటకు సులువైనదని, జనక మహారాజు వంటివారు రాజులై రాజ్య పాలనము జేసియు ఋషులైరనియు, ఇట్టి రాజ రహస్యములను దెలుపుట చేనిది "రాజ విద్యారాజ గుహ్య యోగమైనది".

**భగవానుడు :**

జనన మరణ రూప సంసార బంధము
విడువ గలుగు నట్టి వివరమైన
అతి రహస్యమైన ఆ జ్ఞాన మంతయు
దెలుపు చుంటి నీకు సులువు గాను.

విద్యలందు మిగుల విమల మైనట్టిది,
అతి పవిత్ర మతి రహస్యమైన
శాశ్వతంబు, సులభ సాధ్యము నైనది
అనుభవమున దీని నరయ దగును.

ప్రాణి కోటులెల్ల పరగ నాయందుండు
నేను వాని యందు లేను నిజము
ఇంద్రియముల చేత నెరుగగరానట్టి
నేను విశ్వమంత నిండి యుందు.

సర్వకాలములను, సర్వము నందును
వ్యాప్తి గలిగి యుండు వాయు వెపుడు
ఆకసంబులోన నధివసించిన యట్లు

సకలమైన భూత జాలమెల్ల
నన్ను జేరి యుండు సన్నుతంబుగ నని
తెలిసి కొనుము పార్థ! తెలివి గలిగి.

క్రతువు, యజ్ఞమదియు, పితృ పిండంబును
ఔషధమును, మంత్ర, మగ్ని నేనె
హోమ కర్మనేనె హోతయు నూనేనె
తల్లి దండ్రి పూజ్య ధాత నేనె.

ఈ క్రింది పద్యము గీతా వాక్యము ల[illegible]డె హారమునకు మధ్యమ మణి వంటిది. గీత యనెడి వృక్షమును ఫల పుష్పములచే వృద్ధి చేయబడినట్టిది.

అన్య చింత లేక యనవరతంబును
మనసు నందు నన్నె మనన జేసి
పరమ దైవమైన పరమాత్మ యగు నన్ను
ఎల్ల వేళ లందు నుల్ల మందు
దలచు వారి సేమముల నెల్ల నేజూతు
భక్తవరుల కెపుడు భయము లేదు.

నిర్మల మగునట్టి నియమము గల యట్టి
మనసు గలిగి యుండు మానవుండు
భక్తి నిచ్చు పత్ర, ఫల, పుష్పచయముల
స్వీకరింతు నేను సేమ మలరి.

ఎంతటి పాపి యైనను చేసిన తప్పు తెలిసికొని భక్తుడైనచో పుణ్యాత్ముడై తరించును. దీనికి వాల్మీకి ప్రబలమైన ఉదాహరణము.

పాపములను జేసి పాపాత్ముడైనను
పాప చింతనముల పారద్రోలి
అన్య చింత లేక ననవరతంబును
నన్ను దలచు నేని సన్నుతముగ
గట్టి నమ్మకంబు గలవాడు గనుకను
అట్టి వాడు సాధు వనగ బరగు.

మనసు నందు నన్నె మననము జేయుచు
భక్తి తోడ నన్ను ముక్తిగోరి
నిష్ఠ తోడ నన్ను నీవాశ్రయించిన
నన్ను జెందగలవు నయము గాను.

## 10. విభూతి యోగము

ఇందు భగవంతుని యోగ శక్తి అంతులేని దనియు, అట్టి భగవంతుని మహిమ దెలిసి కొనుట గూడ యోగమని దెలువ బడినది.

**భగవానుడు :**

జన్మ మాది లేక సకల లోకాలకు
ప్రభువు ననుచు నన్ను పార్థ! యెవడు
తెలియ గలడొ వాడు తెలివి వరుండగు
వాని పాప మెల్ల వరుస దొలగు.

సత్యశమద మాది సమత, సంతుష్టియు
జనన మరణ, దుఃఖ, సౌఖ్యములును
దాన ధర్మములును, తపము, క్షమయు, కీర్తి
కర్మ వశత నేను కలుగ జేతు.

**అర్జునుడు :**
నీవు దెలిపి నట్టి నీ తత్త్వమంతయు
సమ్మతించు చుంటి సత్యమనుచు
దేవ దానవులును దేవ! నీ నిజ రూప
మరయ జాల రయ్య పరమ పురుష.

ఎట్టి మహిమ వలన నీ లోకముల యందు
వెలసి యుంటి వీవు విలసితముగ
దివ్యమైన నీదు నవ్య విభూతుల
దెలువ దగుదు వీవె కలుషహరణ!

భగవానుడు :

అంతరాత్మ నేనె యఖిల భూతములకు
ఆది మధ్యములును అన్ని నేనె
విష్ణు, సూర్య, చంద్ర వివిధ రూపములలొ
వెలసి యుందు నేనె విలసితముగ.

దేవతలలొ నేనె దేవేంద్రుడౌదును
వేదములలొ సామ వేద మగుదు
భూతములలొ నేను చైతన్య మగుదును
నేనె మనసు నగుదు నింద్రియముల

జీవరాశికెల్ల జీవంబు నేనయ్య
నా విభూతి లేని జీవి లేదు
సూక్ష్మముగను నీకు సూచించి నాడను
నా విభూతులన్ని నయము గాను.

భగవ దంశ కలిగి బహు కాంతియుతమునై
వెలసి యుండు వస్తు జాలమెల్ల
ఈశ్వరాంశ నుండి యీడేతీనట్లుగ
దెలిసి కొనుము నీవు తెలివి గలిగి.

## 11. విశ్వరూప సందర్శన యోగము

ఇందు భగవంతుని యొక్క విశ్వరూపము బాగుగా చూపబడినది.

అర్జునుడు :

పరమ పురుష! నీవు పరమ రహస్యంబు,
ఆత్మ విద్య రూపమైన యట్టి
విషయములను నాకు వివరించి నందున
మోహమెల్ల తొలగె మోహ నాంగ!
నకల జీవరాశి చావు, పుట్టుకలును,
అన్ని దెలిసె నయ్య ఆదిదేవ!



నిన్ను గూర్చి కృష్ణ! నీవు చెప్పిన దెల్ల
నమ్మ్రతింతు నేను సత్యమనుచు
ఈశ్వరత్వ మొదవు విశ్వరూపము జూడ
కోరుచున్న వాడ, కోర్కె దీర్చు.

భగవంతుడు :

చూడ వయ్య పార్థ! చూడ శక్యము గాని
నాదు రూప మెల్ల నయము గాను
చర్మ చక్షువులకు సాధ్యము గాదది
దివ్య దృష్టి నిత్తు భవ్యచరిత!

సంజయుడు :

వినుము రాజ! శౌరి విహితము గానట్లు
బలికి పిదప తనదు భవ్య రూవ
మర్జుననకు జూపె నతి మహోన్నతమైన
విశ్వ రూపమెల్ల విస్తృతముగ.

రత్న హారములును, రమణీయ వస్త్రాలు,
పుష్ప మాలల తొన పూర్వముగను
అన్ని వైపులందు నఖిల ముఖాలతో
వాసనలతొ గూడి వాస్తవముగ
ఈశ్వరత్వ మొదవు విశ్వ రూపంబది
తేజరిల్లు చుండె దివ్యముగను.

అర్జునుడు :

శిరసు వంచి భక్తి చేతులు జోడించి
దేవ దేవ నీదు దేహ మందు
సర్పములు, విధాత, సర్వ దేవతలను,
సకల మునుల, భూత సంచయముల
గద, కిరీట, చక్ర ఘనమైన యాయుధ
ములను గలిగినట్టి మూర్తి గంటి

ఆది మధ్యమంత, మది గోచరింపదు
విశ్వ రూపమందు విశ్వ వినుత!
సూర్య తేజ మట్లు చూడ శక్యము గాని
నిన్ను జూచు చుంటి నీర జాక్ష!

ఉగ్ర రూప మందు నున్న నీవెవరవో
తెలియ జేయ వయ్యా దేవ దేవ!
వందనంబు జేతు వసుదేవ సుత నీకు
నన్ను నుగ్రహింపు నళిన నయన!
నీ ప్రవర్తనంబు నిజముగ దెలియదు
నిన్ను దెలియ దలతు నీరజాక్ష!

భగవానుడు :

ప్రాణి కోటి నెల్ల పరిమార్చుటకు గాను
కాల యముడనైన ఘనుడ నేను
శత్రు సైన్యములను సమర మందున నీవు
చంపకున్న వారె చత్తురయ్యా.

శత్రువుల జయించి శాశ్వత కీర్తిని,
అఖిల రాజ్య సుఖము లనుభవించు
ఇంత ముందె నాచె అంత మొందిరి వీరు
కేవలము నిమిత్త మీవ క్రీడి!

అర్జునుడు :

వరుణు, డగ్ని, యముడు, వాయువు, బ్రహ్మయు,
అతని తండ్రి, సూర్యుడాది గాగ
అన్ని నీవె నయ్యా ఆది దేవా నీకు
వేయి వందనములు వేద వేద్య!

నీదు మహిమ దెలియ నేరక యాదవా!
సఖుడ! కృష్ణ! యనుచు సాహసమున
పిలిచి యుంటి నయ్యా, తెలియక జేసిన
నేర మెంచవలదు! నీరజాక్ష!

తండ్రి తన కుమారు తప్పును, మిత్రుని
తప్పు మిత్రుని వలె, తనదు భార్య
తప్పు భర్త వలెను. మెప్పు వహించినా
తప్పు లెల్ల గాయ తగుధు వీవె
నీకు వందనంబునే జేసి, మన్నింప
వేడు చుంటినయ్య వేద వినుత!

మునుపు జూడనట్టి ముచ్చటౌ నీ రూపు
జూచి సంతసించు చున్న వాడ
భయము గలిగె మదిని భద్రమౌ నీ నిజ
రూపు జూపి భయము బాపు మయ్య.

**భగవానుడు :**

ఇట్టి విశ్వరూప మిదివరకెవ్వరు
జూచి యుండ లేదు. జూచి తీవె
యజ్ఞ, దాన, తపము, అరయ వైదిక కర్మ
వలన నన్ను జూడ వశముగాదు.

నీవు దప్ప నన్ను నెవ్వరు జూడని
రూప మిదిగొ నీకు జూపు చుంటి
భ్రాంతి నొందకయ్య భయపడ వలదయ్య
సంతసముగ జూడు సవ్యసాచి!

**అర్జునుడు :**

మూర్తి మంతమైన మునుపటి మానవ
రూపు గాంచి మిగుల నేపు మీర
శాంత చిత్తు డైతి చింత దొలంగెను
మనసు కుదుట బడెను మాన్య చరిత!

భగవానుడు :

నన్ను నమ్మి కొలిచి నా కొర్కై మంచి
కర్మ లాచరించు నిర్మలుండు
సకల ప్రాణు లందు శత్రు భావము లేని
యతడు నన్ను జేరునయ్య పార్థ!

# 12. భక్తి యోగము

శ్రద్ధతో గూడి సదా భగవన్నామస్మరణ జేయువాడు గొప్ప వాడని, భక్తిని గూర్చి వివరింపబడి నందున ఇది భక్తియోగ మైనది.

అర్జునుడు :
నీవు దెలిపినట్లు నీ యందె మనసిడి
నిను భజించు చుండు మనుజు లందు,
నిర్వికారుడవగు నిన్ను భజించెడి
భక్తులందు పరమ భక్తు లెవరు?

భగవానుడు :
పూర్ణ భక్తి తోడ పూజ్య మార్గమ్ముల
ఎల్ల వేళలందు నుల్లము నను
నన్ను దలచు వారె నాకతి ప్రియులయ్య
అట్టివారు యోగులందు ఘనులు.

సర్వ భూతములను సమ భావమున జూచి
మిత్ర ధర్మములను మిగుల గలిగి
దయయు సతము గలిగి దాక్షిణ్య భావాన
మమత లేని యట్టి మానవుండు
సుఖము, దుఃఖములను సుముఖముగా నెంచి
గర్వ రహితుడైన సర్వసముడు
మనసు నిగ్రహించి మదిని సంతోషియై
ధ్యాన యోగ పరుడు నైన యోగి
దృఢము నైన యట్టి దృష్టిని గలిగియు
మాధవాను రక్తి మదిని గలిగి
నట్టివాడు నాకు నమిత ప్రియుండగు
ననుచు దెలియ వయ్య అమర వినుత!

శత్రులందు మరియు మిత్రుల యందును
సమత, మమత గలిగి సాగువాడు
స్తుతియు, నింద యందు సుముఖత గలిగియు
మౌన ధారియైన మానవుండు
తన శరీర మదియు తగ నిలుచుటకునై
కొంత తిండియైన సంతసించి
నియతమైన యట్టి నిజ నివాసము లేక
నిశ్చలమగు మనసు, నియతి గలిగి
పరమ పురుష నందు భక్తి భావము గల్గి
నట్టివాడు నాకు నమిత ప్రియుడు.

శ్రద్ధ గలిగి నన్ను శరణాగతిగగొని
నేను జెప్పినట్టి నియతమైన
ధర్మములను నెవరు ధరను పాటింతురో
అట్టి వారు నాకు నమిత ప్రియులు.

## 13. క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగ యోగము

పంచ భూతములతో గూడిన శరీర మెటువంటిదో, శరీర మందు వశియించెడి ఆత్మ యెట్టిదో. వీనిని వేరు పరచి తెలిసి కొనుట వలన ఆత్మలో నైక్యము కలుగునని ఇందు తెలుప బడినది.

**అర్జునుడు :**

ఏది ప్రకృతి యనగ? నెవడు పూరుషడగు
క్షేత్ర మనగ నేమి? మిత్రవర్య?
జ్ఞాన మనగ నేమి? దానిని దెలుపుము
జ్ఞేయ మేది? తెలియ జేయవయ్య
క్షేత్ర విజ్ఞుడెవడు? మిత్రమా వీనిని
వివరముగను దెలుప వేడు చుంటి.

భగవానుడు :

క్షేత్ర మనగ నదియె మిత్రమా! దేహము
దీని నెవ డెరుంగు దీక్ష బూని
క్షేత్ర విజ్ఞుడనుచు మిత్రమా! విబుధులు
తెలిపి రయ్య నీవు తెలియ వయ్య.

దురభి మానములను నిరతము వదలుట,
కపట మనుట లేక కరుణ గలిగి,
విషయ సుఖము లందు విముఖత్వమును గల్గి
అట్టి హీనములను నట్టె వదలి
పారిశుద్ధ్య గుణము, పరగ గురుల సేవ,
ఓర్పు గలిగి యుంట, నేర్పు మీర
మనసు నిగ్రహంబు, మమకారములు వీడి,
కోరికలను విడిచి కోప ముడిగి
ప్రియము, లప్రియములు ప్రాప్తించి నప్పుడు
మనసు లోన నెట్టి మార్పు లేక
తత్త్వ మరయుటకును తగు నిశ్చలత్వము,
శాంత్య హింస, శమము చాల గలిగి
అన్య చింత లేక అర మరికలు లేని
మనసు తోడ నన్ను మనన జేసి
జన సమూహ మందు తనకు నప్రీతియు,
జ్ఞాన లక్షణంబు లౌను పార్థ!
తద్విరుద్ధమైన దంతయు నజ్ఞాన
మనగ దెలియ దగును వినయ చరిత!

పరమ పురుష డనగ, పరమాత్మ యీ దేహ
మందు సాక్షి వలెను పొందు గాను
చూచు చుండు వాడు, చోద్యము గాగను
అనుమతించు వాడు, అనుభవించు
నట్టి వాడు మరి నియామకుండై నట్టి
యతనిని పరమాత్మ యందు రయ్య.

అట్టి పురుషు నెరిగి నట్టి వాడును మరి
ప్రకృతి నెరిగి నట్టి పావనుండు
సర్వ కర్మములను నిర్వహించుచు నున్న
జన్మ మొంద బోడు జగతి నతడు.

సర్వ భూతములలో సమముగ నెలకొని
ఆ శరీరములవి యంత మొంద
తాను శాశ్వతముగ తగ నుండు పరమాత్మ
జూచు వాడె నెరుగ జూచువాడు.

ఒక్క సూర్యుడెట్లు ఉర్వినెల్ల ప్రకాశ
మొప్ప జేయుచుండు మెప్పుగాను
క్షేత్ర మందు నున్న సూత్రమౌ శుద్ధాత్మ
వివిధ దేహములలో వెలుగు చుండు.

క్షేత్ర భేదములను, క్షేత్రజ్ఞ భేదముల్
ప్రకృతి బంధములను పరగ విడుచు
మార్గములను నెరుగు మానవాతీతులు
మోక్ష మంద గలరు మోదముగను.

## 14. గుణత్రయ విభాగ యోగము

ఇందు త్రిగుణముల యొక్క స్వభావములను, ఈ త్రిగుణములను వదలిన పరమాత్మలో నైక్యము కలుగుననియు తెలుపబడినది.

భగవానుడు :

నకల యోను లందు జన్మించు వారికి
మాయ తల్లి యగును మహిని నిజము
దైవ బీజమైన తండ్రిని నేనని
తెలిసి కొనుము పార్థ! దీని విధము.

దేహ మేర్పడుటకు దేహికీ త్రిగుణాలు
కారణంబు లగుట కడకు దెలిసి
ఈ త్రిగుణము లెల్ల యిట్టి కడ ద్రోచియు
పుట్టుకయును, చావు, మునలితనము
దుఃఖములను వదలి తులనాత్ముడగువాడు
ఐక్య మందు నాలో ననువు గాను.

అర్జునుడు :

త్రిగుణములను తుద కతిక్రమించిన వాడు
ఎట్టి లక్షణముల నెనగు చుండు
అట్టివాని నడత లవి యెట్టు లుండును
త్రిగుణ రాశి నెట్లతిక్రమించు.

భగవానుడు :

స్తుతియు, నింద, సకల సుఖమును, దుఃఖము
ప్రియము, నప్రియంబు ప్రీతిగ గొని
శత్రు మిత్రు లందు సమభావమును గల్గి
నిశ్చలత్వముగను నిలిచి యుండి
మట్టి పెళ్ళ, రాయి మరియును బంగారు
సమము గాను జూచు సజ్జనుండు
గుణములకు నతీత గుణశాలియగు నంద్రు
తెలియ వయ్య పార్థ! తెలివి గలిగి.

నిశ్చలమగు భక్తి నెవడు సేవించిన
ఈ గుణముల దాటి యెనగు వాడు
బ్రహ్మ రూప మొంద బాగుగ తగి యుండు
సాధనంబు నేనె సకలమునకు.

# 15. పురుషోత్తమ ప్రాప్తి యోగము

పురుషోత్తమ ప్రాప్తి అనగా పరబ్రహ్మ ప్రాప్తిని కలుగ జేయున దగుటచే దీనికి పురుషోత్తమ ప్రాప్తి యోగమను పేరు గలిగినది. దీనిని భోజన కాలమున పారాయణ జేయుట మంచిది. భోజన కాలమున దేహమందలి ఆత్మను పరమాత్మగ భావించవలెను. భగవంతుని తత్త్వము, జీవుల ఉత్పత్తి, సంసార పరిభ్రమణము, గమ్య స్థానము చేరు మార్గము మొదలగునవి ఇందు తెలియ జేయబడి యున్నవి.

భగవానుడు :

సారహీనమైన సంసారమును రావి
చెట్టు తోడ పోల్చి చెప్పదగును
మొదలు పైకి నుండు తుద నుండు కొమ్మలు
అర్ష వేదములుగ నాకు లుండు
నాశనంబు లేని నయమగు తత్త్వము
వేద విదు డెరుంగు వివరముగను
ఆది, మధ్య, మరియు, అంతము దెలియని
పాతు కొన్న వేళ్ళ బలము గలిగి
సాగుచున్న యట్టి సంసార వృక్షము
నిశ్చయంబు నైన నియతి గలిగి
వేగ నరుక వలయు వేవిధముల ననా
సక్తి యనెడు గొప్ప శస్త్రమునను
మరల జన్మ లేని పరమ పదంబును
వెదక వలయు నయ్య విదితముగను.

వాయు వెట్లు పూల వానన గొనిచనున్
పుట్టినపుడు జీవి గిట్టినపుడు
మనను నింద్రియముల మానక గొనిచను
ననుచు దెలియ వయ్య వినుత యశుడ!

ధ్యాన యోగ వరుడు తనలోని యాత్మను
తెలియ గలడు తనదు తెలివి చేత
ఆత్మ శుద్ధి లేని యవివేకు లెరుగరు
ఆత్మ యొక్క మర్మ మమర వినుత!

కాంతి సూర్యు నందు, కాంతి చంద్రుని యందు
అగ్ని యందు తేజ మదియు నేనె
చంద్ర కిరణములతొ సస్యములను నేనె
పోషణంబు సేతు పోడిమిగను.

జనగణముల యందు జఠరాగ్నినై నేను
భోజ్య, భక్ష్య, లేహ్యా, చోష్యములను
ప్రాణ పానములను వాయువులతొ జేరి
పచన మొనర జేతు బాగు గాను.

భూత కోటు లందు భూతాత్మనై యుందు
స్మృతియు, మరపు, మరియు సకలమైన
జ్ఞానమునకు కర్త నేనని దెలియుము
సకల కర్మములకు సాక్షి నేనె.
వేద వేద్యుడేను, వేదాంత కర్తను
వేద మెరిగినట్టి విశ్వమయుడ.

శంక వదలి నన్ను సర్వేశ్వరుడనని
తెలియు నట్టి వాడు తెలివి పరుడు
వాడ నన్య భక్తి తోడ నన్నెప్పుడు
గొలుచు చుండు నయ్య పొలుపు మీర.

అతి రహస్యమైన యట్టి యీ జ్ఞానము
సవ్యసాచి! నేడు సవివరముగ
దెలిపి నాడ నీకు దీని నెరింగి, కృ
తార్థుడగుము నీవు ధాత్రిలోన.

## 16. దైవాసుర సంపద్విభాగ యోగము

ఇందు దైవ, రాక్షస గుణములను వివరించి, రైతు పైరు నందు గల కలుపు మొక్కలను తీసి వేసినట్లు రాక్షస గుణములను తొలగించి హృదయమును పరిశుద్ధ మొనరింపవలెనని తెలువబడినది.

భగవానుడు :

జ్ఞాన యోగ మదియు దాన గుణంబును
తపము, చిత్త శుద్ధి, దమము, శాంతి,
భయము లేక యుంట బహు భూత దయయును,
ధైర్య గుణము, క్షమయు, శౌర్య మదియు
త్యాగ బుద్ధి గలిగి ధరను తేజస్సును
గలిగి చెలగు మరియు విలసితముగ
సత్యగుణ మహింస, సకల భూతము లందు
కరుణ గలిగి, కోప, కపటములను
దరిని జేర నీక పర పీడనము లేక
విషయ లంపటముల విముఖుడగుట,
శుచియు, సిగ్గు గలిగి యా చాపలము వీడి
ద్రోహ చింత లేక మోహ మెడలి
కొండెములను జెప్ప కుండుట మొదలుగ
గలుగు సుగుణములను గలిగి చెలగి
భగవ దంశ యందు భవము నొందినవాడు
పొంది యుండు పార్థ! పొంకముగను.

అసుర గుణము లందు నమర బుట్టిన వాడు
దురభి మాన, కోప, పరుస దనము,
పొగరు బోతు దనము తగ గర్వ మదియును
కలిగి యుండు పార్థ! తెలివి లేమి.

సత్త్వ గుణము వలన సంసార బంధము
తొలగి మోక్ష పదము గలుగు పార్థ!
అసుర గుణము గలుగ నది బంధమగు నయ్యా
దాన సుఖము లేదు [illegible] న
నీవు పుట్టినావు దైవ [illegible] యందు
చింత వలదు నీకు సుంతయైన.

మంచి, చెడ్డ లవియు మది నెరంగగ లేక
శుచియు, చిత్తశుద్ధి శుభ్రతయును
సత్య, ధర్మములవి సొంతము నెరుగరు
అసుర గుణము లివియె ఆత్మ సఖుడ.

అల్ప బుద్ధులైన ఆసురీ గుణులెల్ల
క్రూర కర్మ జేయు వారలగుచు,
చెడిన మనసు గలిగి చెడ బుట్టు చుందురు
జగతి నాశమునకు జగతిలోన.

ధనము గలదు నాకు, దానము జేసెద,
గొప్ప కులము వాడ, మెప్పుగాను
యజ్ఞములను జేసి యనుభవించెద, నేను
భోగ, భాగ్యములను బొంద గలను
అనుచు నరక మందు నజ్ఞాన; మోహాన
బడుచు నుంద్రు మిగుల చెడుగు లగుచు.

అన్ని దేహములలొ నాత్మయై వెలిగెడు
నన్నెరుంగ లేక నన్ను దూరు
నట్టి మానవులను నాసురీ యోనుల
జన్మ మొంద జేతు జగతి లోన.

అసుర యోను లందు ననవ రతము బుట్టి
నన్ను బొంద లేక నలుగు చుంద్రు
మరల, మరల, తిరిగి, మరియు నీచము నైన
జన్మ నొందు చుంద్రు జగతి లోన.

క్రోధ, లోభ, మరియు కోరిక, లీ మూడు
నరక మార్గములను నెరుక గలిగి
విడువబడిన నరుడు కడు మోదమును బొంది
మోక్ష మొంద గలడు మోదముగను.

మొసలి చేత పట్టబడిన ఏనుగు వలె కామ, క్రోధ, లోభములను మూడు గుణములచే పట్టబడిన వాడు దుఃఖములను పొందును. ఈ మూడు గుణములను వదలిన వాడు సర్వేశ్వరునిచే విడిచి పెట్టబడిన గజేంద్రుని వలె మోక్షము నొందును.

శాస్త్ర విధిని విడిచి సాహాస వంతుడై
ఇచ్ఛ వచ్చినట్లు తుచ్ఛమైన
కామ భోగములకు గడగి వర్తించునో
వాడు సిద్ధి బొంద లేడు జగతి
ఇహము నందు సుఖము, ఇంపుగ స్వర్గము,
కడకు మోక్షమైన గాంచ లేడు.

చేయ దగిన దేది, చేయ దగని దేది?
యనెడు ధర్మ నంది యంబు నీకు
కలిగి నపుడు శాస్త్రముల నాశ్రయించియు
కర్మ లాచరింప గడగు పార్థ!

# 17. శ్రద్ధాత్రయ విభాగ యోగము

రాజస, తామస గుణములను విడిచి సత్త్వ గుణము నవలంభించిన వాడు అంతః కరణము శుద్ధి గలిగి ఆత్మను పొందుట వలన ఆత్మ పరమాత్మలో లీనమగునని ఇందు వివరింవ బడినది.

అర్జునుడు :
శాస్త్ర విధినీ వదలి శ్రద్ధాను రక్తులై
అర్చ నాది విధుల నాచరించు
నట్టివారి గుణము లెట్టివై యుండును
నందియంబు గలిగె సర్వ వినుత
సత్త్వ గుణమ? రాజసమ? లేక తామస
గుణమ? కృష్ణ! తెలియ గోరు చుంటి.

భగవానుడు :

భువిని మానవాళి పూర్వ సంస్కారక
జనితమైన యట్టి శ్రద్ధ యదియు
సత్త్వ గుణము, రాజసము, తామసమునని
మూడు విధములుండు ముఖ్యముగను.

జనులకెల్ల పూర్వ జన్మ సంస్కారవు
శ్రద్ధ గలుగు చుండు చక్కగాను
శ్రద్ధ లేనివాడు జగతిని లేడయ్య
శ్రద్ధ ననుసరించి జనుడు నడచు.

సత్త్వ గుణము వారు సకల దేవతలను
రాజసంబు వారు రాక్షసులను
తామసంబు వారు తాము పూజింతురు
భూత, ప్రేతములను ప్రీతితోను.

జనులకెల్ల రకును జగతి నాహారము
మూడు విధము లుండు ముచ్చటగను
యజ్ఞ, దాన, తపము లవి మూడు విధములు
వినుము వివరముగను విశద పరతు.

సాత్త్వికులకు నెపుడు సంతుష్టి గలిగించి
బుద్ధి బలము, దేహ పుష్టి గలుగు,
సంతసంబు, సుఖము, సతము నారోగ్యము
కలుగ జేయునట్టి విలువ యైన,
ఆకలణచి పెట్టు నాహార మిష్టము
తెలియ వయ్య నీవు చెలిమి కాడ!

అమితమైన యుప్పు, అతి పులుపైనట్టి
చేదు, కారములును, బాధ గొలుపు
అధిక వేడి గలుగు నాహార మెంతయు
ప్రీతి గలుగ జేయు రాజసునకు.

పాసి పోయి నట్టి, పక్వము గానట్టి
చాల నిలువ యున్న శాకములును
శుచియు, రుచియు లేని, శుభ్రతయును లేని
ఎంగి లన్న మదియు యెంతగానొ
తామసునకు నెపుడు తగి యుండు ననుచును
తెలియ వయ్య పార్థ! దీని విధము.

తాను చేయదగిన దనుచు దలంచియు
కోరికలను వీడి కోరి చేయు
యజ్ఞ మేది గలదొ నది సాత్త్వి కంబగు,
ననుచు దెలియ వయ్య నను వు గాను
ఫలము నభిలషించి బల దర్పముల జేయ
రాజసంబు నగును రాజపుత్ర!

శాస్త్ర విధిని విడిచి, సరియగు మంత్రతం
త్రములు లేక మరియు శ్రద్ధ లేక
దాన, ధర్మ ములును, దక్షిణలవి లేక
తాను చేయు క్రతువు తామస మగు.

మంచి నడత, శుచియు, మరి బ్రహ్మ చర్యంబు
జ్ఞాన వంతులైన జనుల, గురుల
సర్వ దేవతలను సతము పూజించుట
అది శరీర తపసు ననగ జెలగు.

ఒరుల మనసు నొచ్చు పరుష భాషణములు
పలుక కుండుటయును, చెలువు మీర
ప్రియము, హితము నైన ప్రియ భాషణములును,
వేద పఠనములును, విహిత ములగు
మంత్ర జపము లెల్ల మానక జేయుట
వాచికపు తపస్సు పార్థ! వినుము.

మనసు నిర్మలంబు, మౌనము, శాంతము
ఆత్మ నిగ్రహంబు అమర గలిగి
మనసులోన హరిని మననము జేయుట
మానసిక తపస్సు మానవులకు.

శ్రద్ధ లేక చేయుజప; తప, దానము
"లసతు" లనగ బరగు నయ్య పార్థ!
ఇహ పరంబు లందు నించుక యైనను
ఫలిత మేమి లేదు. వాని వలన.

# 18. మోక్ష సన్యాస యోగము

మోక్షము యొక్కయు, సన్యాసము యొక్కయు లక్షణములు వివరముగ తెలుపబడి నందున దీనికి మోక్ష సన్యాస యోగమను పేరు గలిగినది. కేవలము తలలు బోడి జేసికొని కాషాయ వస్త్రములు ధరించుట సన్యాసము కాదనియు, సర్వ కర్మ ఫలత్యాగమే సన్యాసమనియు ఇందు వివరింపబడినది.

**అర్జునుడు :**

త్యాగ మనగ నేమొ? తగ జెప్పుమో కృష్ణ!
సన్యసంబు ననగ సవివరముగ
వేరు వేరుగాగ వీని యర్థంబులు
తెలియగోరు చుంటి తెలుప వయ్య!

**భగవంతుడు :**

ఫలము గోరి చేయబడు కర్మముల వీడ
సన్యసంబ టంద్రు సకల బుధులు
సర్వ కర్మ ఫలము సొంతము విడుచుట
త్యాగ మందురయ్య తత్త్వ విదులు.

త్యాగ మనగ నదియు తామస, రాజస
సాత్త్వికంబు ననగ శాస్త్ర మందు
మూడు విధము లంచు ముదమున జెప్పిరి.
యజ్ఞ, దాన, తపము విజ్ఞులకును
చిత్తశుద్ధి కలుగ జేయుట వలనను
విడువ దగదు వీని విమల చరిత!

నియతమ్మైన యట్టి నిత్య కర్మములను
విడిచి పెట్ట దగదు విబుధులకును
అట్లు విడువ బడిన యాత్యాగ మనునది
తామసంబు నైన త్యాగ మగును.

కష్టములను మిగుల కలుగ జేయు నటంచు
కాయమునకు బాధ కలుగు ననుచు
భయము చేత కర్మ వదలిన నాత్యాగ
మవని రాజసంబు ననగ బరగు
పొంద నేర డతడు పొలుపుగ త్యాగపు
ఫలము నిదియ నిజము ఫల్గుణుండ!

వేద శాస్త్రములలో విధియింపబడినట్టి
సకల కర్మములను సవ్యముగను
ఫలము నంద భిరుచి పరగ విడిచి చేయ
నదియె సాత్త్వి కమని యందు రవని.

ఎవనికైన కర్మ లెల్లను విడువగ
వీలు గాదు గనుక మేలు గాగ
కర్మఫలము లెల్ల కడ ముట్ట వదలిన
త్యాగి యగును వాడె యోగి యగును.

బ్రాహ్మణునకు చెప్పబడి నట్టి కర్మలు
వివరముగను నీకు విశద పరతు
శమము, దమము, తపము, శాస్త్ర విజ్ఞానము
సత్ప్ర వర్తనంబు సమున్నతమగు
ఓర్పు, నేర్పు, శుచియు నొనర ననుభవంబు

దైవ మందు, వేదభావ మందు
నమ్మకంబు గలిగి నయముగ జేసెడి
కర్మలన్ని నియత కర్మలగును.

శౌర్య, ధైర్య, కీర్తి సహజమై, రణ మందు
పారిపోక యుండి పోరుటయును
ప్రజల పాలనంబు, పరమాత్మ పై భక్తి
గలిగి చేయు కర్మ క్షాత్ర కర్మ.

వ్యావసాయకంబు, వ్యాపార కర్మయు
పశుల రక్షణంబు వైశ్యునకును
పరుల సేవ జేయు పావన కర్మయు
శూద్ర సహజ కర్మ శూర చరిత!

పరమ ధర్మమైన పర ధర్మమున కంటె
నీచమైన మరియు నింద్యమైన
తనదు కర్మ జేయ తగునయ్య నరునకు
పాప మంట బడదు పార్థ! వినుము.

కర్మలెల్ల నివురు గప్పిన నిప్పటు
కుంతి పుత్ర! దోష గుణము లెయగు
ధర్మ మార్గమైన కర్మ, దోషము తోడి
దైన, దాని నెపుడు మానరాదు.

బ్రహ్మ పదమును బొందు వానికి వలయు గుణములివి.

నిర్మలమగు బుద్ధి, నేమముతో మనో.
నిగ్రహంబు గలిగి నియతి తోడ
స్పర్శ, శబ్ద, రూప, సర్వ విధములైన
విషయ సుఖము లెల్ల విడిచి పెట్టి
మితముగా భుజించి మతియును, మాటయు
అదుపు లోన నుంచు నట్టివాడు
యెల్ల వేళలందు యేకాంత వాసియై

ధ్యాన యోగమందు మానసమిడి
ఇహా పర సుఖములలో నిష్టము లేకుండ
బలము, దర్పములను బారద్రోలి
కోరికలును, మరియు కోప మహంకార
ములును లేనివాడు సులువు గాను
బ్రహ్మ తత్త్వ మదియు బడయగ నర్హుడు
కర్మ సిద్ధి బొంది కడకు నరుడు
బ్రహ్మ పదము నెట్లు పడయగ వచ్చునో
సఖుడ! తెలిపి నాడ నవివరముగ.

నిశ్చల మగునట్టి నిర్మల భక్తితో
నన్నెరుంగ గలడు నన్నుతముగ
నన్ను దెలిసి నట్టి నరుడు నా యందున
ఐక్య మందు చుండు నయ్య పార్థ!

సర్వ కర్మములను సర్వేశ్వరుడ నగు
నాకు నర్పణంబు నయము గాను
జేసి నన్ను జేర చింతించి నా యందు
మనసు నిల్పు వయ్య వినయ శీల!

నన్ను దలచి దలచి నాయనుగ్రహమున
సంకటముల నెల్ల సాంతముగను
అధిగమించ గలవు నటు గాక మిక్కిలి
గర్వముననను నాదు సర్వహితము
వినని యెడల చెడెద వీవు వాస్తవ మిది
తెలియ వయ్య నరుడ తెలివి గలిగి.

అహంకారము గలిగి నీవు ఆహవ మొనరింప
నన్నుచు దలతు వేని వినుము పార్థ!
నీ స్వభావ మదియె నిను పురి గొల్పును
సిద్ధపరచు నిన్ను యుద్ధమునకు.

ఈశ్వరుండు సకల విశ్వము నందలి
ప్రాణి కోటు లందు పరగ వెలసి
తనదు మాయ చేత తగ సర్వభూతాల
యంత్ర మందు త్రిప్పు తంత్రముగను.

పార్థ! ఈశ్వరుండు పరమ శాంతియు మోక్ష
పదము నిచ్చు నీకు ముదము గాను
అతని శరణు వేడ నన్ని విధంబుల
నెంచి చూడ నీకు మంచి దగును.

అతి రహస్యమైన యట్టి జ్ఞానము నీకు
తెలియ జెప్పినాడ సలలితముగ
మనసు లోన దీని మరీ మరి యోచించి
ఆచరింపు మయ్య అమర వినుత.

మనసులోన నన్ను మరి మరి దలచుము
నాదు భక్తుడగుము నయము గాను
నన్ను మనన జేసి నాకు నమస్కార
మొనర జేసి తేని వినయముగను
నన్ను బొంద గలవు నాకిష్టుడవు నీవు
సత్య మిదియ ప్రతిన సలుపు చుంటి.

సర్వ ధర్మములను సరగున విడిచియు
నన్నె శరణు బొంద నరుడ! నీదు
పాపములను నేను పరిహార మొనరింతు
చింత వలదు నీకు నంతయైన.

పై పద్యము గీతా రత్నహారమునకు చివరి మణి వంటిది. గీతా వృక్షమునకు పండిన ఫలము వంటిది.

విశ్చలంబు నైన నిజ చిత్తమున నీవు
చక్కగాను గీత శాస్త్రమెల్ల
ఆలకించి నావ? అర్జున! అజ్ఞాన
మునను గలిగి నట్టి మోహ మెల్ల
తొలగి పోయి నదియ? తెలియ జేయవయ్య
వినగ దలతు నేను వివరముగను.

అర్జునుడు :

అచ్యుతా తొలంగె యజ్ఞాన మంతయు
జ్ఞాన మెంతొ గలిగె దీన పోష
సందియంబు లెల్ల సమసి పోయినవయ్య
చేతునయ్య నీవు చెప్పినట్లు.

సంజయుడు :

విజయునకును మరియు విజయ సారథి మధ్య
అచ్చెరువును గొలుపు నట్టివైన
మాట లెల్ల వింటి మది పులకించెను
ధన్య మాయె జన్మ మాన్య చరిత!

యోగ ధనుల కెల్ల యోగేశ్వరుండగు
నచ్యుతుండు వెలసినట్టి చోట,
విల్లు చేతబట్టి విజయు డెచ్చట నుండు
విజయ లక్ష్మి యచట విడిది సేయు
రాజ్యలక్ష్మి గూడ రాణయొప్పారగ
నొప్పియుండు రాజ! మెప్పుగాను
నీతి నియమములవి నిలకడగా నుండు
ననుచు నమ్ము చుంటి నార్యవినుత!

## సంసార సాగర తరణోపాయము

ఏ నరుండు ఘోరమైన సంసార, స
ముద్రమును తరింప బూను కొనునొ
అతడు గీత యనెడు యా నావ జేరిన
దరిని జేర గలడు తథ్యముగను.

# గీతా ధ్యానము

స్వయముగాను కృష్ణుడే యర్జుననకును
బోధ జేసినట్టి మోక్షగాథ,
వ్యాసముని వరుండు వాసిగ వ్రాసిన,
భారతమున మధ్య భాగమందు
వెలసి యున్న యట్టి వేద తుల్యంబైన
తనను తాను తెలిసి కొనగ జేయు,
సారహీనమైన సంసార దుఃఖము
తొలగ జేసి సుఖము కలుగ జేయు,
పదునెనిమిది యోగ భాగములతొ గూడి
ఆత్మ తత్వమెల్ల అమర జేయు
విష్ణు రూపిణియును, వినుతింప దగినట్టి
గీత మాత! నిన్ను కీర్తింతు.

# కృతికర్త వంశానుక్రమము

ముగన్న సుబ్బమ్మ, మాతండ్రి రామయ్య
తూపల్లి వంశాబ్ధి తుహిన కరులు
లువురు సోదరుల్ గలిగినా రందున
సుబ్బాయ మా పెద్ద సోదరుండు
రాయణస్వామి నయమూర్తి, వేంకట
రత్నమ్మ మా వంశ రత్నమునగ
డపటి వాడుగ కడు రమ్యముగ బుట్టె,
కృష్ణమూర్తిని నేను కృతి యొనర్చి

ంద్రునకు నూలు పోగను సామెతగను
ద్యకుసుమాల మాలను పరమ భక్తి
ర్పణమ్మొనరింతునో ఆది దేవ
న్మసార్థక మొందనీ జగతిలోన.

ంగళము సర్వ మంగళ
ంగళకర మహిత తేజ! మాధవ శౌరీ!
ంగళము విజయ సారథి!
ంగళములు మాకు నొసగు మా కృష్ణయ్యా!